శ్రీ సరస్వతీ మూవీస్ & శ్రీ వెంకటేశ్వర ఫిలింస్ వారి

# శ్రీ సింహాచల క్షేత్ర మహిమ

క, స్క్రీన్ … త్వం: బి. వి. ప్రసాద్

సంగీతం: టి. వి. రాజు





# కథాసంగ్రహము



శ్రీమన్నారాయణుడు కృతయుగంలో నృసింహావతారమెత్తి హిరణ్యకశిపుని వధించినపిదప ప్రహ్లాదుని కోరికపై శ్రీహరి హిరణ్యకశిపుని సంహరించిన నృశింహావతారము, హిరణ్యాక్షుని కడతేర్చిన వరహావతారము కలిసి సింహగిరిపై వరాహనృసింహునిగా వెలుస్తాడు.

ప్రహాదుడు నిత్యమూ వరాహ నృశింహుని పూజిస్తాడు. అతని నిర్యాణానంతరం మునులకదీ ఆరాధ్యమౌ తుంది. శరీషాది అప్సరకన్నెలు కేళీవిలాసాలలో ఆకసంనుండి పూలహారం జారి మునిపుంగవుల ధ్యానానికి భంగం కలుగ జేస్తుంది. అంతలో నారదుడు అక్కడకు వచ్చి వివరాలు గ్రహించి శరీష జీవన నాటకంలో ప్రవేశిస్తాడు.

దేవేంద్రుని సముఖంలో శరీషా జిగీషల పోటీ నృత్యం జరుగు తుంది. విజేతయైన శరీషను ఇంద్రుడు కామిస్తాడు. కాని శరీష మనస్సులో ఒక ఊహాసుందరుని చిత్రించు

కొని అతనికే తన మనస్సు అంకితం చేస్తుంది. అతని కొరకు త్రిలోకాలు వేదుకుతూంటుంది.

భూలోకంలో పురూరవ చక్రవర్తి తనమిత్రుడైన అనవ సరంతో వేటకు బయల్దేరతాడు. వేటలో జరిగిన ఒక విచిత్రమైన ప్రమాదంవల్ల మిత్రులిద్దరూ విడిపోతారు. పురూరవుడు గాయపడి ఒకచోట స్పృహ తప్పి పడి పోతాడు. శిరీష భూలోక విహారంలో పురూరవుని చూడటం తటస్థిస్తుంది. అతడే తన ఊహాసుందరునిగా గుర్తించి ఆమె సంతోషంతో పొంగిపోతుంది. స్పృహవచ్చాక శిరీషా పురూ రవుల మధ్య ప్రేమఅంకు రిస్తుంది. ఇంద్రుడు శిరీషను రావించి తనవశం కమ్మని శాసిస్తాడు. బలాత్కరించ బోతాడు. అందుకు శిరీష కోపోద్రిక్తయై "బలిమిచే గర్జించే సింహాన్ని సహితం నాట్యం చేయించగలవేమో గాని, పవిత్ర మైన గోమాత పొదుగులోంచి నీ యిష్టమొచ్చింది పొంద లేవు" అని ప్రతిఘటిస్తుంది. శిరీష ప్రతిరాత్రి భూలోక విహా రం వెళ్తుందని జిగీష ఈర్ష్యతో ఇంద్రునికి తెలియజేస్తుంది. దానికి ఫలితంగా శిరీషను 'భూలోక వాసివికమ్మని, అంతే గాక పురూరవుని స్మృతిపథంలోనుండి తొలగి పొమ్మని శపిస్తాడు. స్వర్గావాసరత కోలుపోయిన శిరీష పురూరవుని చేరు కుంటుంది గాని ఇంద్రుని శాపప్రభావంవలన పురూరవుడు

ఆమెయెడల ఒక అపరిచితవ్యక్తిగా ప్రవర్తిస్తాడు. నిస్సహాయురాలైన శిరీషకు ఒకకోయకన్య ఆశ్రయమిస్తుంది.

మిత్రుని విడిపోయిన అనవసరం చివరకు పురుషద్వేషిణులైన స్త్రీ సామ్రాజ్యం చేరుకుంటాడు. కన్యగా ఉన్న రాణికి మగవాని చూడటమే అది మొదటిసారి రాజశాసనం ప్రకారం పురుషుడైన అనవసరాన్ని చెరలో వేస్తారు. తానొక భావి భర్తనిగా నటించి రాణిని నమ్మించి చివరకు ఆమె కోటలోనే పాగా వేస్తాడు. అన్నెమూ పున్నెమూ యెరుగని రాణీమనసులో అనవసరం అనురాగాన్ని అంకురింపజేస్తాడు. వసంతోత్సవంలో శిరీష ఒకకోయకన్యగా పురూరవుని ముందు నాట్యం చేస్తుంది. పురూరవుడు శిరీషగా ఆమెను మర్చిపోయినా కోయకన్యవసంతగా ఆమెను ప్రేమించి గాంధర్వవిధిని వివాహం చేసుకుంటాడు. పురూరవుని తండ్రి ఆ వివాహానికి అభ్యంతరం తెలియజేస్తాడు. పవిత్రమైన ప్రేమకోసం పురూరవుడు రాజ్యమే పరిత్యజించి వసంతతో పాటు అరణ్యమార్గాలు పడతాడు. మార్గమధ్యంలో

# — నటీనటులు —

| | |
|---|---|
| కృష్ణకుమారి | కాంతారావు |
| గిరిజ | రేలంగి |
| లీల | రాజనాల |
| మోహన | చలం |
| వాణిశ్రీ | నల్లరామమూర్తి |
| సుగుణశ్రీ | రాజబాబు |
| కృష్ణవేణి | సారధి |
| లక్ష్మి | వై. వి. రాజు |
| జానకి | మాస్టర్ బాబు |

ఝాన్సీ - సరోజ - రాజేశ్వరి

గంగాధర్ - గోపాలరాజు - మోహన్ - కాకరాల



— అతిధి నటులు —

నాగయ్య - రామకృష్ణ - సూర్యకాంతం

కోయబృందం వారికి కారసిల్లి పురూరవుని తమ యేలికగా చేసుకొంటారు. ఆ గూడెంలో శిరీషా పురూరవుల ప్రేమ పంటగా ఒక మగశిశువు జన్మిస్తాడు.

శిరీషకు దేవేంద్రుడిచ్చిన శాపం అమెపాలిట వరంగా మారిందని నారదుడు శిరీష విషయం ఇంద్రుడికి గుర్తు చేశాడు ఇంద్రుడు కోప పిశాచాన్ని పంపి కోయగూడెం గండరగండనిలో ప్రవేశింపజేసి అతనిలో స్త్రీవాంఛను, రాజ్య కాంక్షను ప్రకోపింపజేస్తాడు. దానితో అంతవరకు సన్మార్గంలో ఉన్న గండరగండడు దుర్మార్గుడై వసంతను చేపట్టి పురూరవుని కడతేర్చి గద్దెనాక్రమించాలని ప్రయత్నిస్తాడు.

కోయదేవత పూజకై మంత్రపుష్పం సాధించి తేవాలని గండరగండడు పురూరవుని కోరుతాడు. పురూరవుడు బయల్దేరి భయంకరమైన మహారణ్యాలు, కొండగుహాలు దాటి మంత్రపుష్పానికి కాపలాగానున్న విచిత్రమృగాన్ని రాక్షసుడిని వధిస్తాడు. రాక్షసుడు మరణించి గంధర్వ కన్యగా రూపొందుతాడు. మంత్రపుష్ప మహిమను చెప్పుతూ అశించినది సిద్ధించడమేగాక దాని నాళరంధ్రములో ఊదగా వచ్చే నాదస్వరం ఎవరిపై ప్రయోగిస్తే వారు కర్తవ్యం మరచి నాట్యం చేస్తారని కూడా చెప్తుంది. గృహోన్ముఖు

తొతున్న పురూరవుని ఇంద్రుడు శునకంగా మార్చివేస్తాడు. గండరగండడు వసంతను బలాత్కరించ ప్రయత్నించి గుడిసె బైటికీడ్చుకొచ్చి గుడిసెకు నిప్పంటిస్తాడు. గుడిసె లోపల బిడ్డ ఉయ్యాలలో ఉంటాడు.

ఇంద్రుని శాపంవలన శునకంగా మారిన పురూరవుడేమౌతాడు?

మంటల్లో చిక్కుకున్న పసిబిడ్డను ఎవరు ఎలా రక్షిస్తారు?

గండడి దుర్మార్గానికి ఎరమైన వసంత గతి ఏమౌతుంది?

—వెండి తెరపైచూడండి



# — పాటలు —



పాట 1 పాడినవారు : ఘంటసాల

సింహాచలమూ
మహా పుణ్యక్షేత్రమూ
శ్రీ వరాహ నరసింహుని
దివ్యధామమూ ॥సి॥
చూచినవారి కనుల పండుగ
చూడనివారి జన్మ దండుగ
ప్రహ్లాదుడు వేడగా
శ్రీహరి కరుణించగా
ద్వయ రూపాలొకటిగా
యుగ యుగాల గురుతుగా
వెలసిన హరి నిలయము ॥సి॥
ఏ చోటను కన్నా
భక్తుల సందోహమే !
ఏ నోటను విన్నా
హరినామ స్మరణమే !
హరి హరీ నారాయణ
ఆదినారాయణ

కరుణించి మమ్మేలు
కమల లోచనుడా
పాపాలను హరియించే
దైవ సన్నిధానమూ ॥సి॥

మొక్కులను ముడుపులను
చెల్లించే వారికీ —
తననీలాలర్పించీ
కొలిచేటి వారికీ
ఇహపరముల సమకూర్చే
భగవంతుని నిలయము ॥సింహా॥

పాట 2 పాడినవారు: పి. బి. శ్రీనివాస్

నారద : జయహే మోహనరూపా !
గాన కలాపా ! ఆది స్వరూపా !
ఆశ్రితమణి దీపా ! ॥జయ॥

హరినారాయణ
దురిత నివారణ
లీలామానుష రూప విహారీ
దానవజన సంహారీ ! ॥జయ॥

అవతారుడవై
యుగ యుగాలలో
సుజనోద్ధతికై - అరుదెంచావా !
పాహి సుదర్శన ధారీ ! ॥జయ॥

పాట 3 పాడినవారు: పి. సుశీల - ఎస్. జానకి

శిరీష : అందాల ఓ సుందరా !
అనురాగ భావ రసకేళీ విహారా ॥అందాల॥

జిగీష : అందాల ఓ సుందరా !
అనురాగ భావ రసకేళీ విహారా ॥అందాల॥

శిరీష : మధుర వసంతాన తొలి వెలుగు నేను
జిగీష : తొలకరి పరువాన చిరునవ్వు నేను
శిరీష : భావ సరాగాల లాలింతునోయీ
జిగీష : భోగ విలాసాల తేలింతునోయీ
ఇద్దరూ : నాట్యగానముల నాసాటి నే నే ॥అందాల॥
శిరీష : ఝనన ఝనన ఝన మంజీర ధ్వనిలో
జిగీష : ధిమికిట ధిమికిట అడుగుల సడిలో
శిరీష : లలిత మనోహర సంగీత ఝరిలో
జిగీష : సరస సుధామయ శృంగార గతిలో
ఇద్దరూ : నాట్యగానముల నాసాటి నేనే ॥అందాల॥

పాట 4 పాడినవారు: పి.బి. శ్రీనివాస్-ఎస్ **జానకి**

శిరీష ; రావోయీ రాజా
కనరావోయీ రాజా !
చెలి నేరాలు మన్నించరావా
అనురాగాల తేలించరావా ॥రావోయీ॥
విరహాల తిమిరాలు తొలగించవా
అనురాగ దీపాలు వెలిగించవా
వినుకానక — పిలువ లేనిక
మనసు నీదే — ఓ ప్రియా ! ॥రావోయీ॥

పురూరవ; విరహాల తిమిరాలు తొలగించవా !
అనురాగ దీపాలు వెలిగించవా

శిరీష ; చెలికన్నుల — విరిసె వెన్నెల
కనవదేలా ఓ ప్రియా !

పురూరవ; రావే విరిబాలా —
దరి రావే జవరాలా !
నయగారాల మన ప్రేమ గాథ
కలకాలాలు నిలిచేది కాదా !

ఇద్దరూ : విడలేని బంధాల అనుబంధము
వెలలేని రాగాల అనురాగము
మనదేనుగా కలపి తీయగా
మురిసిపోదము హాయిగా ...

పాట 5 పాడినవారు; పి. సుశీల & కోరస్

కోరస్ : ఓహో ఏలికా ! ఇదే వేడుక
ఈ వసంత వినోదాలు నీకు కానుక
దొరా ! నీకు కానుక ॥ఓహో॥

వసంత : ఆకాశంలో తారనూ _
నీకోసం భువి జారేనూ
మెలకువలో కలను _ కలలో చెలిని
ఔనన్నా కాదన్నా - నీదానను ॥ఓహో॥
నదిసే నైవా తీరదు దాహం
ఎదనీ దైవా ఏలయీ విరహం
తీయని స్నేహం _ చేయకు శోకం
మనసే తెలిసీ _ నన్నేలరా
నీలోనే వున్నానురా!
నీకై వేచున్నానురా !
నీవే నా గానం _ నీవే నా ప్రాణం
కాదంటే కన్నీరే నా జీవితం ॥ఓహో॥

పాట 6 పాడినవారు : పి. సుశీల

వసంత : హాయిగా .. ఏదో తీయగా
నా కలలే పండుగ

ఈరోజే పండుగ ॥హాయి॥

విరిసినది-మురిసినది

కిల కిలా మనసు యిలా

ఏమో!.... హాోయ్!ఒహో హోయ్ ॥హాయి॥

అలనై సెలయేటిలో తుళ్ళియాడనా

విరినై పూలదోటలో వూగి తూగనా

యీ అందము - నా డెందము

రారాజు కీయనా॥ ॥హాయి॥

వినువీధిని చిలుకవలె _ ఎగిరి పోదునా

ప్రియు కౌగిలి నన్ను నేను మరచి పోదునా

యీ అందము నా డెందము

రారాజు కీయనా

నా రాజు కీయనా.... ॥హాయిగా॥

పాట 7 పాడినవారు : ఎల్. ఆర్. ఈశ్వరి

నీలాటి రేవు కాడ

నేరేడు చెట్టునీడ

ఆనాడు నాతో చేరి

సైఁ యన్నాడు _ మాఁవ

చేయిలో చెయ్యేసి

నువ్వే నేనన్నాడు

కన్నులతోనే-సైగలు చేసి
నవ్వులు నాపై రువ్వాడు
చూపుల బాణం నాపై వేసి
నన్నే గారడి చేశాడు
నా మనసే దోచాడు
కవ్వించాడు-నవ్వించాడు
చక్కదనాల రెక్కలు చాపి
శివ్వున ఎగిరే గువ్వను
పడుచుతనాల పడగను విప్పి
ఆడే కోడి త్రాచునూ
నన్నే పసికట్టాడు-నను పట్టాడు
చేపట్టాడు....
వెన్నెలకాసే చల్లనివేళా
చెవిలో గుసగుసలాడేను
సిగ్గులు నాలో సడిచేస్తుంటే
బుగ్గన చిటిచిటికేశాడు
ఎవడే
యింకెవడే!
ఆహ ఎవడే
కలలో కనుపించాడు
మరపించాడు

మురిపించాడు
కలచెరిగి_కనుమరుగై
కదిలెల్లాడు_అయినా
నాలో తన తీపి గురుతు
వదిలెల్లాడు

పాట 8 పాడినవారు ;ఎస్. జానకి

వసంత ; చిన్నారీ పొన్నారీ వెన్నెల రాశీ
జో! జో! బాబూ! అదిగో బూచీ
నిను కని మురిసితిని బంగరు పాపా
మా కనుపాపా "చిన్నారీ"

జాబిలి నిను కని-పిలిచెను రమ్మని
కోరి-చేరి-కులికేవేమొ!
అదే అదే చిలికెను నీ కనులలోన
వెన్నెల వాన "చిన్నారి"

ఏ వరమున ఇలా
వెలిసితివో కదా!
నీవే మాకు జీవన జ్యోతి
కిల కిలా మురిపెముల
నీ చిరునవ్వులు-మాకిక సిరులు "చిన్నారి"

పాట 9 పాడినవారు ; ఎస్. జానకి

వసంత ; బాబూ!............
బాబూ బిరాన కనుపించరా!
కనుపించి నాబాధ తొలగించరా-
ఆశ కల్పించరా! ॥బాబూ॥

నీ జాడ కనలేని కనులెందుకు
నిను చేరగాలేని బ్రతుకెందుకు
నువు లేనిదే నేను మనలేను బాబూ! ॥బాబూ॥

గారాల మురిసింత వనుకొంటిని
నానోము ఫలియించె ననుకొంటిని
నా ఆశ అడియాశ గావింతువా!
నీ తండ్రి కేరీతి తెలిపేను బాబూ ॥బాబూ॥

పాట 10 పాడినవారు ; పిఠాపురం,
స్వర్ణలత కోరస్

పురుషుడు: ఒప్పుల కుప్పా!
ఒయ్యారి భామా
మగాడు పిలిచాడే

ఉవ్విళ్ళూరే పువ్వుల బాణం
నీపై వేశాడే :

స్త్రీ : జిత్తులమారీ :
ఎత్తులు వేయకు
చిత్తము కరుగదులే
మెత్తని నవ్వుల మగాళ్ళ చేసే
మోసం సాగదులే

పురుషుడు; ఓ... చిలకల్లాగా :
ఎప్పటికైనా
పురుషుల చేరి పడతులు బ్రతకాలీ
పురుషుల చేరి పూజలుచేసి
పడతుల బ్రతకాలీ

స్త్రీ : ఓ టక్కరివాడా!

పురు : ఫడాల్ ఫడి !

స్త్రీ: గొప్పలు చాలు–మగాడికన్న–మాదే పై చేయి

మగాడికన్నా-మగువేమిన్న-మాదే పై చేయి

పురు : పై చేయి మీదేగాని
చేయి చేయి కలపండి!
మన చేయి చేయి కలపండి

స్త్రీ : అందినచో అత్యాచారం
అందనిచో కాళ్ళబేరం
అంతే మగాళ్ళ వ్యవహారం!

పురు : ఫడాల్ ఫడీ
కన్నులతోనే ఖైదును చేస్తే
కదలడు చెలికాడు
చిన్నది పన్నే వలలో చిక్కి
బానిస అవుతాడు
ప్రియుడూ బానిస ఔతాడు

స్త్రీ : మగవాడే రాజీకొస్తే
మనసే బహుమతి చేయమా!
మా మనసే బహుమతి చేయమా!

స్త్రీలు | ఇద్దరమూ కలిసి మెలిసి
పురుషులు | ఇంపారగ ఒకపైపోయి
ఆనందపు టంచులు చూద్దాం ॥ఒప్పులకుప్పా॥

పాట 11 పాడినవారు: ఎస్. జానకి

వసంత: ఓ దేవా!

వరాహముఖా_నృసింహశిఖా!
దయామయ నన్నిక కావుమయా! ॥ఓ॥

కరిరాజు నలనాడు కాచేవు కాదా!
కరుణించి నను నేడు కాపాడలేవా!
ఆలించవా_మొరాలించవా
ఆవేదనే_నాకు నీ దీవనా? ॥ఓ॥

క్షీరాబ్ధిపై నీవు శయనించినావా?
సిరికేళిలో తేలి మైమరచినావా?
నాగాథనూ_నా బాధనూ
వినలేక యీరీతి శిలవైతివా! ॥ఓ దేవా॥

ఏలనయా నీకీ మౌనం
చూపవయా నీ నిజరూపం
తీర్చవయా మా పరితాపం
కానగ రావేలా
కావగ రావేలా? ॥ఓ దేవా॥

పద్యం 12 పాడినవారు : ఘంటసాల

పురూరవ :

సీ॥ భక్తశిఖామణి ప్రహ్లాదు కరుణించి
ఆవిర్భవించిన ఆదిదేవా!
వరకల్పవల్లివై వసుధలో వెలసిన
రమణీయ రూప వరాహ వదనా!
దుష్ట విశిక్షణా! శిష్ట సంరక్షణా!
ఇంద్రాదివినుత సింహేంద్రమధ్య!
అణురూప బహురూప అఖిల లోకాధార
ధీరమోహన అవతార పురుష!

ఆశ్రయించిన భక్తుల ఆర్తిదీర్చి
పూజచేసినవారికి ముక్తినిచ్చి
దయతో కాపాడుచున్న-ఓ దయాస్వరూపా !
సింహగిరివాస ! వరహ నృసింహదేవా !



# ★ సాంకేతిక నిపుణులు ★

| | |
|---|---|
| మాటలు : పాటలు | రాజశ్రీ |
| సంగీతం | టి. వి. రాజు |
| కళ | బి. ఎన్. కృష్ణ. |
| ఛాయాగ్రహణం | మధు & లక్ష్మణ్ గోరే |
| శబ్ద గ్రహణం | వి. శివరాం బి. ఏ. బి. యస్. సి |
| పాటలు రికార్డింగ్ | జీవా_కోటేశ్వరరావు |
| | వి. శివరాం |
| | మోహనసుందరం. |
| కూర్పు | మార్తాండ్ |
| నృత్యం | చిన్ని_సంపత్ |
| దుస్తులు | బి. అప్పారావు |
| శిల్పి | చిట్టిబాబు |
| సెంట్స్ | స్వామినాథన్, సోము |
| ప్రొడక్షన్ | మోహనరావు బి. శ్రీనివాసరావు బి. యస్. సి. |
| పబ్లిసిటీ | రామదాస్ కె. |
| ప్రెస్ పబ్లిసిటీ | బి. బలరామ రెడ్డి |

## — సహాయకులు —

| | |
|---|---|
| దర్శకత్వం | యం. ఎ. రెడ్డి, త్యాగరాజ్, ప్రసాద్ వి. డి |
| కళ | శ్రీనివాసరావు |
| ఛాయ | పోలు భాస్కరరావు, మాధవరెడ్డి |
| కూర్పు | వెంకటేశ్వరరావు, నాగేశ్వరరావు |
| దుస్తులు | ఎస్. అప్పారావు, గోపాల కృష్ణ |